చ. గురు కరుణాకటాక్షమునకుం దగి నేర్చినయట్టిరీతి నేఁ
బరమతపోనిధానులును బ్రహ్మసమానులు నైనమీకు మీ
కరుణనుగోరి చెప్పితిని గాని ఘనుండ నటంచుఁ గాదు నే
నరుదుగఁబల్కు నీచరితమందునఁ దప్పులయేని సైఁపుడీ. ౧౫౨.

మ. అని వాక్రుచ్చిన రోమహర్షణి మునుల్ హర్షంబునంగాంచి పెం
పునఁ బీతాంబర కుండలాదులిడి సంపూజించి పంపంగ నా
ఘనుఁ డత్యంత కుతూహల ప్రథితహృత్కంజాతుఁడై తీర్థపా
ధునిఁ జిత్తంబున నెంచుచుం జనియెఁ దోడ్తోఁ దీర్థయాత్రారతిన్. ౧౫౩.

క. స్కాందపురాణాంతర్గత, మిందుకళాధరుఁడు గౌరి కెఱిఁగించిన యీ
చందముఁ జదివిన వినినన్, సందేహము లేదు సర్వసౌఖ్యములబ్బున్. ౧౫౪.

శా. గ్రావోర్వీభమృగాంకసంఖ్యశకమౌగన్ మన్మథాబ్దంబునం
దావిశ్వేశ్వరుసత్కృపాప్తిశరదృత్వంతర్భవాష్టాంబులం
దేవేళం బరికించి కృష్ణకవిరాజిశ్కా కృతిపి చక్రమం
బావిర్భూర్కముగాఁదగన్ సలిపె నౌరా! నాగనీ గ్రంథమున్. ౧౫౫.

ఆశ్వాసాంతము.

మ. ప్రతిమాతీతవిసర్జనాంచితుఁడు సుబ్బాయుం డతండిచ్చు పెం
పుతగ న్నాకొక మేల్కుటుంబభరణంబుం జేయఁగాఁ జాలు శా
శ్వతభూదానమొసంగి సత్కృతి నిజైశ్వర్యం బవార్యంబు గా
క్షితిఁ జేయింపఁగఁ జేసి నీకొసఁగితిం జేకొమ్ము లోకేశ్వరా. ౧౫౬.

క. చందునకునూలుపోఁగను, చందంబున భక్తి నీకొసంగిన దీనిన్
డెందమున నెంచికొని పెం, పొందఁగ మముఁ బ్రోచియేలు మోహనవేశా. ౧౫౭.

మాలిని. నిరుపమగుణకోశా * నిత్యసత్యప్రకాశా
వరసురకలనాశా * వాసుదేవాద్యధీశా
పరిహృతభవపాశా * పాలితాశ్రితయదేశా
నరసహృదయవేశా * సర్వలోకేశ్వరేశా. ౧౫౮.

గద్యము. ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్త్రి, సమారాధిత విబుధరాజశ్రీపాద, కృష్ణమూర్తికవిరాజప్రణీతంబైన కావేరీచరిత్రంబను మహాపురాణంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

Sree Kalavati Series No. 3.



# కీర్తికాంతాస్వయంవరము.

[illegible] శ్రీ [illegible] గోపాలరాయకవి ప్రణీతము.

—§0§—

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే

ప్రకటితము.

రాజమహేంద్రవరము.

శ్రీకళావతీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

వెల 4 అణాలు.



1900

# పీఠిక.

"కీర్తికాంతా స్వయంవరము" అను నీ చిన్ని పొత్తము, గోదావరీ మండలమునందలి నరసాపురము కడనున్న గుడిమెళ్లలంక గ్రామవాసులు శ్రీమాన్ ఇయ్యాణ్ణి అనంతపద్మనాభ దేశికాచార్యులవారు, రాజమహేంద్రవరమునందున్న మాకళావతీ కార్యస్థానమునకు విచ్చేసి, పురాతనప్రబంధ ప్రకటనాయత్త చిత్తులమగు మాకగపఱచి, "ఈ గ్రంథరత్నమున్ మీ కళావతీ కంఠాభరణంబుగాఁ జేసికొనుం" డని యొసంగిరి. మేము వందనపూర్వకముగాఁ గైకొని దీని నామూలాగ్రముగఁ బఠించి, ఇట్టిచక్కని గ్రంథము మన కళావతిం బ్రచురించు భాగ్యంబు గలిగెఁగా యని పరమానందంబు బొంది యిట్లుపక్రమించితిమి.

ఇది మహీశూరపుర (మైసూర్) సంస్థానాధీశ్వరుండు శ్రీచామరాజాత్మజుండు శ్రీకృష్ణమహారాజుగారి పరమౌన్నత్యముం దెలుపు నుత్తమగ్రంథము. దీనిని తదాస్థాన కవీశ్వరులెవ్వరో రచియించియుండవచ్చును గాని గ్రంథకర్త నామమిందెచ్చటనుం గానరామి నిశ్చయించి వ్రాయుటకు వీలుపడదయ్యె. గద్యమునం జూడరాదా, యన నది మాకు లభించిన ప్రతిలో వ్రాయఁబడియుండలేదు. మేము మైసూరి గ్రంథవిషయమరయఁ గొందఱికి జాబులు వ్రాసితిమి కాని, కారణమేమో ప్రత్యుత్తర మొక్కఁడేనియు లేదు, గ్రంథతత్త్వమంతయుం దెలియునంతవఱకు ముద్రింపకూరకుండుమో యన గ్రంథస్వారస్యంబునం గల చాపలంబునం బ్రచోదితులమై వేగిరించితిమని వేరఁ జెప్పికొనవలయునా?

ఇందలికథ మనోహరమైనది.—త్యాగుఁడను రాజునకు సాహసలక్ష్మియను భార్యకలదు వారిద్దఱు సంతానకాంక్ష హిమవంతంబునకుం బోయి తపం బొనరించునపుడు గౌరిప్రత్యక్షంబై వరం బొసంగె. అంతవారికిఁ గొంతకాలంబునకుఁ గృపయుం గీర్తియు నను నిద్దఱు కొమార్తెలుపుట్టి దినదిన ప్రవర్ధమానలై యౌవన ప్రాదుర్భావసమయంబునఁ దండ్రియనుమతి స్వయంవరంబునం బెండ్లియాడం దలంచి కూడినరాజలోకంబులో లోకంబులలేనితమ యోగ్యతులకొడంబడని యెల్ల రాజుల నొల్లక, మహీశూర పురీశ్వరుండగు చామరాజకృష్ణ భూపాలుని వరియించి వివాహము చేసికొనుట లోనగునది చక్కఁగ వర్ణింపఁబడి యున్నయది.

శ్రీ

# కీర్తికాంతాస్వయంవరము

శా. శ్రీమచ్చంద్రకళావతంస, త్రిజగత్సింహాసనాసీన తే
జోమూర్తి, త్రితయాదికారణము, సంశుద్ధాత్మ, లోకైకసం
స్థానమూలంబు, త్రయీస్వరూపిణియు నౌచాముండికాదేవి, తాఁ
బ్రేమం బ్రోచుతఁ జామరాజతనయుం గృష్ణరాజాగ్రణిన్.

సీ. కంటికిత్తునకు మొక్కలిరక్కసులు కాపురంబున్న యూళ్లు పారంబోసంగి
కలజగంబులఁ గాల్పఁ గడఁగినచేఁదు నేరటిపాదుజాల్కఁ జేర్చిని మెసంగి
జడలలో మినువాఁక చలువపాగామీఁద పాపజాబిలితురా పాదుకొలిపి
పాపయొమ్మలకుఁ దోడ్పాటుగాఁ బెక్కండ్రు నలువలతలల పేరులను దాల్చి-
మిత్తిఁదల మొత్తి సామేనసత్తి హత్తి
బుత్తిముత్తల నీ సిడంబెత్తినట్టి
గిత్తతత్తడి మేటిరాహుత్తు ప్రోచుఁ
గాతఁ గృతిపతి శ్రీకృష్ణభూతలేంద్రు.

చ. సిరి యెదఁ గుల్కఁ బాల్కడలి శేషునిపైఁ బవళించి వేదముల్
పరమమునుల్ సురల్ వొగడ భక్తులపాలిఁటి కొంగుముల్లైయై
పరఁగు సరోజనాభుఁడు కృపారస మొలుంచ్యాంశ సంభవున్
సిరులనొసంగి ప్రోవుతఁ బ్రసిద్ధయశోనిధిఁ గృష్ణభూవరున్.

చ భువనములన్ సృజింపఁగను బ్రోవఁగఁ ద్రుంపఁగఁ జాలుహంసతా
ర్క్ష్యవృషభరాజవాహులకు సాగిలిమ్రొక్కెడి సంస్కృతాంధ్రస
త్కవుల నుతించి కాకవులఁ గాదనియొక్క యపూర్వకావ్యముం
గవిజనచిత్తరంజకముగా నొనరించెద నేర్పు పెంపునన్.

తే. ఆర్యతోఁ గూడి యొక్కనాఁ డష్టమూర్తి
రాజతనగరంబుపై రత్నపీఠిఁ

ప్రమథగణములు శ్రుతులు తాపసులు సురలు
బలసి సేవింపఁగా నిండుకొలువుదీరె. ౫.

సీ. కాళీ శుభాపాంగ పాళీసుధాంభోధి కేళీవిహార మరాళ విభుఁడు
హాలాహలాభీల ఫాలాక్షి నిష్పన్న కీలావహిం ధనికృతమదనుఁడు
సారంగధరకళా సారంగవరడింభ సారంగ ప్రైతేయ చర్మధరుఁడు
స్వారాధనాగత స్వారాట్సరోజభూ నారాయణాదినానామనుండు,
చారుమేరు శరాసనధారి త్రిపుర
హారి సాధుజనానంద కారి భక్త
మానసవిహారి యామ్నాయ మార్గచారి
శంకరుఁడు నిండుకొలువున్న సమయమునను. ౬.

తే. తుహినగిరికన్య గౌరీవధూటి మగని
వదనకమలంబుపైఁ దనవాలుచూపు
లళుల రీతినిముసరంగ నరసియిటులు
పలికెనంజలి యొనరించి భక్తి మీఱ. ౭.

ఉ. దేవ, మహానుభావ, జగతీత్రయనాథ, భుజంగభూష, గం
గావర, చంద్రచూడ, శితికంఠ, యజాచ్యుత ముఖ్యదేవసం
సేవిత, కాలకాల, మృదుశీల, మహేశ్వర, ఫాలనేత్రభూ
పావక, దగ్ధదర్పక, కృపాపర, శంకర, విష్ణువల్లభా. ౮.

తే. ఆదిమధ్యాంతశూన్య, దేవా, మూర్తి నిజ
సవసవగ వింటి మున్ను నా ...
గీర్తి కాంతాస్వయంకీర్తి నాగ
నెవ్వతెయొ? దానితలిదండ్రులెవ్వరొకొ? ౯.

క. ఎవ్వని వరియించెనో యా । జవ్వని, పూర్ణేందువదన, చంద్రివతంసా,
యవ్విధము వినఁగ నామన । ముఱ్విళులూరెడు నన్ను యొసఁగుమి నాడుక్. ౧౦

వ. దేవా, తదుదంతంబు సవిశేషంబుగ నీవలన వినంగోరెద దెలుపవేయని ప్రార్థించిన నందిగంధర్వుం డమందానంద కందళిత హృదయారవిందుఁడై, గిరినందనం గాంచి యిట్లనియె. ౧౧.

గీ. అలకింపుము శర్వాణి, యరుణపాణి,
ముక్తినిశ్రేణి, మకరందపూరవాణి,
సైకతశ్రోణి, హైమాగ్రజానిరాణి,
తెలిపెదను నీకు నక్కథఁ దెలివిడిగను ౧౨.

వ. సావధానచిత్తమున నాకర్ణింపుమని యిట్లని చెప్పందొడంగె. ౧౩.

చ. కలఁడొక రాజు, త్యాగుఁడనఁగా భువిఁబుట్టిన నాఁట గోలెఁ గే
వలము జనానురంజకత వర్ధిలి, లోకహిత ప్రవర్తన
న్వెలుఁగుచు నెల్లరుం దనను మేలన, సాహసలక్ష్మి నాఁగ ను
త్పలదళనేత్ర, సత్కులజఁ బాణిగృహీతఁగఁ బ్రీతిఁ గైకొనెన్. ౧౪.

ఉ. సాహసలక్ష్మి, త్యాగుకనుసన్న మెలంగుచు నిత్యపూరతో
త్సాహముఁ గల్గఁజేయుచు, వశంవదగా నొనరించె, వారును
దాహము నాఁటనుండి యెడఁబాయని కూర్మి రమింపుచుండిర
త్యాహిత పుత్రలాభకృతహర్షసముత్సుకమానసాబ్జులై. ౧౫.

క. చిరకాలము త్యాగుండా । తరళాయత నయనతోడ దర్పక కేళీ
పరతంత్రత విహరించెను । సరసీరుహ పత్రనేత్ర, సంతతి లేమిన్. ౧౬

ఉ. సంతతి లేమి త్యాగుఁడును సాహసలక్ష్మియుఁ బెక్కువర్షముల్
చింతిలి, యేమి సేయుదు మిసీ యనపత్యుల మన్నిరోత, జ
న్మాంతరమందు మనన్ జగన్మెతిమి పుత్రులుగల్గు భాగ్యమీ
వంతలఁ గూరనేటికి; తపంబొనరింతమటంచు నెంతయున్. ౧౭.

గీ. తలఁచి, సర్వస్వమగ్రజన్ములకు నొసఁగి,
తపమునొనరించి దాన సంతతినిఁ బడయు
కాంతను, తుషారగిరిప్రాంతఁ గానఁ గోనఁ
జేరి రాదంపతులు శుభశీలురగుచు. ౧౮

చ. హిమగిరి చెంత, మున్ను జగదీశ్వరు శంకరుఁ గౌండ్లియాడు డెం
దమునను శైలకన్యకవ్రతంబు లొనర్చిన యట్టిపావనా
శ్రమమును జేరి, త్యాగుఁడును సాహసలక్ష్మియు నిశ్చలాత్మతన్
దమమును శాంతిఁబూని, యతిదారుణమౌ తపమాచరింపఁగన్. ౧౯.

క. వారలభాగ్యవశంబున । నారీమణి, గౌరియొక్క నాఁడు మగనిచేఁ
గూరిమి తలిదండ్రులఁగను । గోరికబొడముటను సెలవుఁగొని పఱతెంచెన్. ౨౦

క. జననీజనకులఁ జూఁచెదు । మనమున శర్వాణి మంచుమలకుఁ జెలులతోఁ
జనుదెంచి యొక్క నాఁడా । వనమున విహరించువేడ్కఁ బఱతెంచెఁ దగన్. ౨౧

వ. వచ్చి, యయ్యాశ్రమంబు దరియంజేరి. ౨౨

సీ. ఇదికదా తొల్లి నే నీశ్వరారాధన సలిపినపావనాశ్రమతలంబు!
ఇవికదా మనము మున్నీశుని పూజకై విరులుగోయుచునుండు వృక్షతతులు!
ఇవికదా మనతోడ నెనసి నర్తించిన చమరీగవయకృష్ణసారకములు!
ఇదికదా త్రిషవణం బేనాచరించెదు నమలమైనట్టి పద్మాకరంబు!
ఇదికదా యీశ్వరుండు నాయెడను కరుణ
నించి సాక్షాత్కరించిన నెలవటంచుఁ,
జెలిమికత్తెలతోడుతఁ జెప్పికొనుచు,
వచ్చెఁ బద్మాకరముఁ జేర వారిజాక్షి.- ౨౩

క. చనుదెంచి, యందు మజ్జన, మొనరించెడు సాహసాఖ్యు నుత్పలగంధిన్
గని, విస్మితమానసయై, కనికరమున నిటులు శైలకన్యక బలికెన్. ౨౪

ఉ. ఎవ్వతెవీవు సారసదళేక్షణ, దారుణమైన కానలోఁ
నివ్విధి నొంటిఁ గ్రుమ్మరెద వేటికి? నెయ్యఁపుటల్కఁ బూనియా
పువ్విలుకానిఁ బాయురతి పోలికఁ దోఁచెద వేమిగోరియో
జవ్వని, యవ్వనింతపము సల్పెదు నిక్కము దెల్పు, నావుఁడున్.- ౨౫

సీ. సాహసలక్ష్మి యీచందానఁ దన నేమమారయుచున్న యా యార్యఁ గాంచి
తనమది లోకమాతగ నెంచి, భక్తివినమ్రయై, సాఁగి వందన మొనర్చి
హర్షగద్గదిక నిట్లనియె నంజలియొగ్గి, తల్లి, నీకరుణనే ధన్యనైతి
జగదీశ్వరిని నీవు సాక్షాత్కరించుట ఫలియించె నాదు తపంబు నేఁడు-
త్యాగుఁడను రాజునకుఁ గళత్రంబు నేను
దంపతుల మనపత్యతఁ దపముసేయు
చున్నవారము దేవి, యీ యుగ్రవనినిఁ
దపము సిద్ధించె మేలుచేఁ దవిలె మాకు!- ౨౬

ఉ- ఇంకఁదపంబు సాలుజగదీశ్వరి, నిన్నుఁగనంగఁగల్గెని
శ్శంకఁద్వదీయ పాదపరిచర్య యొనర్చుచునుండు నంచునా
పంకరుహాక్షి గౌరి పదపద్మములంబడి సంప్రహృష్టరో
మాంకురయై, ప్రమోదనయనాంబువులం గడిగెం దదంఘ్రులన్, ౨౭

వ. మఱియుఁబునః పునః ప్రణామంబులాచరించుచు, దేవీ, నీవాదిమధ్యాంత శూన్యవు, పరంజ్యోతిస్స్వరూపిణివి, ఆదిశక్తివి, చరాచరాత్మకం బగులోకం బశేషంబునీవలన స్పజింపంబడి, నీచేరక్షింపంబడుచు నీయందు లయంబగు. సృష్టిస్థితి సంహారకర్తలగు త్రిమూర్తులకు మూలకారణంబవు, చండముండ సంహారిణీ, చాముండీ, చండికా, హైమవతీ, దాక్షాయణీ, కాళీ, శివాది నానానామరూపంబులం బ్రవర్తిల్లుచు, విహరింపుచుందువు. నాపుణ్య విశేషంబున నన్ను ధన్యంజేయుతలంపున నిచ్చటికి విచ్చేసితివని, కరకమలంబులు మొగిడ్చి, నిలిచియున్న సమయంబున. ౨౮

గీ. ఆర్య, కనుఁగొంచి, యాసాహసాఖ్యఁజూచి,
తపముసాలించి, పొందుమీ తావుఁజేర
మెచ్చితిని నీదుభక్తికి, మేలుగల్గు
నింకమీకని పల్కి_యదృశ్యయయ్యె. ౨౯

ఉ. ఆగతిగౌరిచేవరము నందిన సాహసలక్ష్మినాథునిం
ద్యాగునిఁ జేరవచ్చి, ప్రమదంబునసాంజలియై, వినీతయై
సాఁగిలిమ్రొక్కి_, పార్వతి యొసంగినయట్టి వరంబుఁ దెల్పినన్
రాగముమీఱఁగాఁ దనపురంబున కాతఁడుజాయతోఁజనెన్. 30

గీ. పావనంబున సాహసశ్రీకినంత
మాలునిలిచెను ద్యాగభూపాలుఁడలర
నెలలుతొమ్మిదగనిండ నన్నీరజాక్షి
సూఁతులనుగాంచె నిరుపురగోర్కి_దీర. 3౧

సీ. అనుకంపయు నిడు కన్యకవారిలోఁబెద్ద, వరగుణరూప లావణ్యశీల
నవనీతమునఁ జేసె నాథాత్రఁయదియుగా దాపాదమస్తకం బమృతమయమొ
యునజగత్ప్రియంజన యైయొప్పె రెండవకూఁతురుకీర్తి నామము మిగిలెఁ
దనుకాంతిపిలిమిముక్తాహార శారదాతారకా రోచియై తల్లిదండ్రు.

ఉల్లములఁ బొంగనంత నాయుత్పలాక్షు
లొయ్యనొయ్యన శైశవంబుజ్జగించి,
నెమ్మియౌవనదశ, తమ్మునిక్కి చూడ,
వృద్ధిఁబొందిరి బాలేందు రేఖలట్లు. ౩౨

ఉ. శైశవముజ్జగించి యల చంద్రముఖుల్ నవయౌవనామృత
ప్రాశనఁ జేసినంతఁగను పట్టెను శిబ్బెము మేనులం, గళా
వేశముఁ గల్గె మోములు, నవీనవిలాసము జగ్గునిగ్గుల
భ్యాశముఁ బేరెఁ జూపరుల కద్భుతమావహిలంగనయ్యెడన్. ౩౩

చ. కనలదొకప్పుడున్, విరసగా దొకనాఁటికి నేని, ధూర్త్తవ
ర్త్తనమనరాదు, పల్కులసుధారస ముప్పతిలంగఁబల్కుఁ, జూ
పునవెడఁ జల్లుఁ జేర్మి, వినఁబోదు దురుక్తుల, బీదసాదలన్
గనిన వహించుజాలి, యనుకంప, గుణంబులకుప్ప యేమనన్. ౩౪

సీ. ఆటలాడెదనన్న నవనీతలంబెంత, చొకళింతు నటన్న జలధు లెంత,
కుప్పళించెదనన్నఁ గుల భూధరము లెంత, పఱచెదనన్న భూవలయ మెంత,
శోధించెదనటన్న సురవిష్టపంబెంత, నిక్కిచూతునటన్న నింగి యెంత,
అరసెదనన్న బ్రహ్మాండ భాండంబెంత, తిరిగివచ్చెదనన్న దిక్కు లెంత,
యనుచు యౌవన కృతగర్వ మతిశయిల్లఁ
దన్నువరియించు రాజగోత్రాత్రితలమున
లేడటంచును, నెవ్వారి లెక్కగొనక,
నమరె నత్తఱిఁ గీర్తికన్యాలలామ. ౩౫

వ. ఇట్లు దినదిన ప్రవర్ధమాన యౌవనలై, పెండిలికిం బట్టులైయున్న యనుకంపాకీర్తి సంజ్ఞలందనకూఁతులం గాంచి, త్యాగమహీనాథుండు, తదనుగణాభిజన్యసౌందర్య చాతుర్యలావణ్యాతిశయులగు రాచకొమరుల నేర్పతింపంజాలక స్వయంవరమహోత్సవంబు చాటంబంచిన, నానాదేశంబులనుండి రాజకుమారులు పఱతెంచి, పురంబు నపడిసిరంత. ౩౬

సీ. త్యాగుండు పుత్రీస్వయంవరార్థంబుగా బఱతెంచినట్టి భూపాలసుతుల
సత్కారమొనరించి, శయనాసనాన్న పానాదులఁ దృప్తుల నాచరించి,

నగుటవీనికి నొప్పిదంబైనరాజ
నందనుని సేవరింతు నానందముగను. ౪౨

వ. అదియునుం గాక. ౪౩

చ. ననువరియించినట్టి నృపనందనుగాని వరింపదన్యనీ
వనజదళాక్షి సాధ్వియప్పుడు భావమదగ్రజ సౌమ్యశీల వ
ర్తన యెడఁబాటు నైఁప దపరాధము సేయదు మేలు గూడుచు
న్మనమునొసంగు దీనినను మానముమాని వరింపఁగాఁదగుఁగా. ౪౪

చ. కనలినఁ జేరరోయి, ననుకంపయ టందురు దీనిపేరు పె
ల్చనఁబరుషోక్తుల న్వినఁగ నైఁపదలంతిగఁ జూడరాదు చం
దనము మనంబు, పల్కులు సుధారసపూరము లిన్నెలంతకీ
వనితవరించినట్టి నరపాలునిఁగాని వరింపనేనొరుఁగా. ౪౫

తే. మనసునమెలంగు నిదియిట్టి మగువపెండ్లి
యాడు రాజన్యుఁడే మాన్యుఁడగును జగతి
మఱియుఁ దెలిపెద నింకొక్క మాటగలదు
వినుఁడుఁ రాజన్యులార, నావిన్నపంబు. ౪౬

చ. కరగతుఁగాఁగఁజేసి కొనఁగాఁదగు మజ్జనకుం బ్రివృద్ధుఁడ
త్పరిహ్రూతిఁ జేయరాదు పరివాదమొనర్పఁగఁగూడ దాతనిం
గరుణను బ్రోవఁగాఁదగును గానియెడం ద్యజియింతు నేను సు
స్థిరమతి నిత్యమాతని ద్యజింపనివానిభజించుచుండెదన్. ౪౭

తే. అదియె సాహస లక్ష్మిమాయంబ సర్వ
కృత్యములఁ దోడుపాటొనరింపఁగలది
సంపదకుమూలమీమె నాజనకుఁడొక్క
నిముసమెడబాసిన సహింపనేరఁడగుట. ౪౮

తే. వీడఁగారాదు వీరల విసువరాదు
అలఁతిచూపులఁ జూడరా దలుగరాదు
ననువరించిన రాజన్యునకును మాన్య
లైనవీరల పోషణంబర్హమగును. ౪౯

క. నాయంబసేని మఱిమా, నాయగ్రజసేని విడిన నాజనకుంగా
చాయను నిలువఁడువెంటనె, పాయుదుఁగాయంబు నేనుబార్థివులారా. ౫౦

వ. అగుట నిన్నింటికి నొడంబడిన రాజన్యకుమారమూర్ధన్యుండు నన్నుఁగా వరియించు

గాతమని కీర్తికాంతావతంసంబు పలికి మిన్నకుండెనంత. ౫౧

ఉ. పెండిలిగాక మున్నెయిటు ప్రేలెదుభూపతు లింతలేసివా
రుండగలజ్జ వీడ్వడి దురుక్తుల నీజగజంత సేలుజా
ణండిపుడున్న రాజకమునంగను పట్టఁడు పొండటంచునొ
క్కండు నృపాలసూనుఁడలుకన్ సరిరాజులతోడఁ బల్కెఁదాన్. ౫౨

వ. మఱియును. ౫౩

సీ. గయ్యాళి దీనితోఁగాదు కాపురమని మేదినీశుఁడొకండు మిన్నకుండె
జగములం దల్లాడుజాయ యేటికటంచు నవనీశుఁడొకఁడు మాటాడకుండె
బాహ్రికాంతమగును సాహసలక్ష్మి పాత్రనిధారుణీశ్వరుఁ డొక్కఁడూరకుండె
నీత్యాగు భరియింప నెవ్వఁడోపు నటంచు నెకిమీఁడొకండునో రత్తుకుండె,
నిండఱికినన్న వస్త్రిము లిచ్చిధనము
పదవుగాఁజేసికొను పెండ్లిఫలముచాలు
చాలువలదని యొక్కభూపాలుఁడుండెఁ
గానివరియింతు ననువాఁడుగా నరాఁడు. ౫౪

చ. వినివిననట్లొకండు, కడుబేదురు జెందినయట్లొకండు, నొ
ప్పనిగతియొక్కఁడీ పెడఁగుపల్కుల కేమనియొక్కఁడిట్లు ల
జ్జనుమొగమోడ జేసి తనచాయఁ గనుంగొన కున్న రాజులం
గనుగొనికీర్తికాంతయలు కంగడకం బలికెన్ సభాస్థలిన్. ౫౫

తే. అకటా! మమ్ముఁ వరియించు నట్టివాఁడు
గలుగఁడాయెనె యీరాజకంబులోన
మెలఁగవలసె ననాథత నిలనుమాకు
ననుచు నిట్టూర్పు నించియిట్లనియె మఱియు. ౫౬

తే. పౌరుషం బుజ్జగించి యీధారుణీశు
లూరకుండిరిగాని యిందొక్కఁడైని
నుగ్గటిమివహించి మామీఁద మనసుపెట్టఁ
డాయె నిర్వీర్యమయ్యెఁ బో యవనితలము. ౫౭

ఉ. పౌరుషహీనులై తలలుపట్టుక పల్కఁగలేక మిన్నకు
న్నారల వీరుపేడుకగనంజను లెంచిరకాని పెండ్లికై
రారిటువంటి పందలకురాఁబని యేమిస్వయంవరార్థమై
తీరుననిండ్లకేగుదురొ దీనతలన్వహియించి మోములన్. ౫౮

వ. అక్కటకటా! యతిభారంబులైన కిరీటాంగదాది భూషణంబులు దాల్చిన వీరు వేషధారులుగా నొప్పుదురు, కానిరాజకుమారులుగా నొప్పరు, వంశంబులు వెలుపం బుట్టిరి నిక్కంబుగా వీరు రాజన్యకుమారులేని స్వయంవరంబున మావంటి సత్కులాంగనామణుల నవామహామికల వరియింపకుందురే! ఇట్టివారల మహీపతులుగాఁ బుట్టించినవిరించి నేమనందగునట్లగుటం జేసి యేకదా! పద్మగర్భుండు పూజార్హుండుగాఁ డయ్యె. అనిపలికి నలుగడలు గలయఁగనుంగొనుచు నారాజలోకంబునకుం దొలంగి ప్రత్యేకంబ సింహాసనాసీనుండైయున్న యొక్కభూపాల నందనుం గాంచెనంత. ౫౭

క. పలుమరుఁ దనవంకం గని । జలిబిలి నగవాననమునఁ జెన్నలరఁగ మీ
సలు గోట దీటు భూవర । తిలకుం గని కీర్తికాంత దలిపి వహించెన్. ౫౮

తే. చూచితలయూఁచి యీలోకసుందరుండె
మమ్ము వరియించునని యనుమానములను
దోఁచుచున్నది మిన్నక చూచునీతఁ
డేలొకో? యనిమది సందేహించుచుండె. ౫౯

వ. ఆన్నృపాల నందనుండు. ౬౦

సీ. దుర్మదావనిపాలశుద్ధాంతపురహాసజీమూతఝంఝానిలుండు
కడులేమిఁ జెంది దిక్కెడలి కుందెడువారి కడగండ్ల దయమాల్పఁ గల్పభూజు
ముష్కరాభీరతురుష్కయావనముఖ్య వీరకాసారగంభీరవేట
కోదమజవ్వనపుటామెదవి పాక్కెడు బోంట్లయుల్లంపు లోక్యంబు మొల్లవిడుపు
సకలరాజన్య మూర్ధన్య మకుటనికర
ఖచిత రుచిర ప్రచురరుచినిచయ యనూత్న
రత్నదీప్తి ప్రదీప నీరాజితాంఘ్రి
సారసుండింపు మీఱును జామరాజు. ౬౧

ఉ. ప్రాక్తనరాజులం గెలిచె భవ్యగుణుండగు చామరాజు భ
క్తిని దేవభూమి దివిషద్గురుభక్తి, ప్రజానురంజనా
సక్తి, బుధానురక్తిని సనాఘ విరక్తి యశోనుసక్తి, స
ద్వ్యక్తిని లోకసత్పథనియుక్తి సుధామధురోక్తి నెంతయున్. ౬౨

మ. పటువాగ్రచనా చమత్కృతి గురుం దర్జింపఁగాఁ జాలు, ను
ద్భట బాహాబల శక్తి నవ్వడముడిన్ ఘట్టింపఁగాఁజాలు, ను
త్కటతేజోగరిమ సహస్రకిరణుం దర్జింపఁగాఁజాలు, ని
ప్పటి రాజన్యులఁ జామరాజు సరిచెప్పన్ వచ్చునే? యెప్పుడున్. ౬౩

ఆ. అతనిధర్మపత్నియైన సాధ్వీమణి
కెంపనంజమాంబ యింపుమిగుల
జగతియదుకులంబు బొగడికకెక్కఁగాఁ
గృష్ణుఁబోలెఁగనియెఁ గృష్ణరాజు. ౬౪

సీ. ఏరాజునిరుపమో దారపుతాపంబు వేసవిరవికిని వేడిచూపు
నేమండలేశు దాతృత్వవైశేష్యంబు శిబికర్ణబలులను సిగ్గుపఱచు
నేమహామహుని నిస్సీమయశోవళక్షత పండువెన్నెలఁ గడకుఁదలంచు
నేపార్థివేంద్రుని రూపవిలాసంబు తలిరుదూపులజోదు తప్పులెన్ను
నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజపరమేశ బిరుదవిరాజమాను
లైన రాజన్యులకు గండఁడనఁగఁబరఁగుఁ
జామరాజసుతుండు కృష్ణనృపవరుఁడు. ౬౫

సీ. కరుణారసంబొల్కఁగాఁ బల్కునేకాని పౌరుషం చెప్పాటఁబలుకఁబోడు
ఉపకారమునకుఁ దానుత్సహించునెకాని కలనైన నపకృతిదలఁపఁబోడు
ఇచ్చుచోనెంతైన నిచ్చుమాటయెకాని యింతయిచ్చితినంచు నెంచఁబోడు
పరులెచ్చుగానున్నఁ బ్రముదమొందుటెకాని యొకనికల్మికినీసునొందఁబోడు
వినయసౌజన్యధైర్య వివేకశౌర్య
సరసతౌదార్య గాంభీర్య చతురతాది
భావుకగుణంబులకు నాటపట్టుచామ
రాజతనయుండు శ్రీకృష్ణరాజమౌళి. ౬౬

చ. యదువులరాజ్యపాలన కనర్హులఁజేయు యయాతిశాప మ
య్యదుకులమందుఁబుట్టియు సమర్థుఁడనయ్యెను మాన్యనైతి న
య్యదననటంచుఁ గృష్ణుఁడు మహాత్ముఁడు చామమహీశు పుత్రుఁడై
యదుకులమందుఁ గృష్ణుఁడను నాఖ్యజనించి ధరిత్రియేలెఁదాన్. ౬౭

వ. మఱియును,

సీ. కడగండ్లఁబడి గతిఁగనఁజాలవంచునాశాసామజముల నేస్తంబురోసి
యదుగంటిచేరఁబోముదుచు మొగంబని కమఠేంద్రు మీఁదిరాగంబువదలి
వారెత్తినను విషజ్వాలలువిని గుద్దుకని చెవుడని ఫణీంద్రు వెడఁబాసి
నిలిచినచో ళ్ళగలచి దుమ్మెత్తునంచని ఘోణిమీఁది మోహంబువిడిచి
పృథివితనయురతఁ జామరాజేంద్ర తనయుఁ

కృతసకలసాధు సంత్రాణు గాంపనంజ
మాంబికాగర్భ శుక్తిముక్తాయమాను
కృష్ణరాజ మహీంద్రు వరించిచేర. ౭౯

సీ. కులగోత్రముల పెంపుదలపక మున్నీటు నుద్ధరించిన మేటి నుజ్జగించి
సార్వభౌమ ప్రేమ సంబంధముడిగి మహాభోగిభోగ సౌఖ్యంబులోసి
తలమోచికొనియుండు ధవునికన్నడ జేసి యంజగొల్చిన సాటి నాసగడపి
యదువంశవార్ధి రాకామృతదీధితి రాజన్యకోటీర రత్నకషణ
సంభవపరాగ శబలిత చరణపీఠు
రాజకంఠీరవుని గృష్ణరాజచంద్రు
వలచిచేరినయట్టి పంటలవలం తి
కెక్కుడేతక్కు దొరలపై నేరగింత. ౮౦

సీ. అరదంబు గృంగిచేవరియున్న తతివైరిసమయ జేసిన ధనంజయుడుదీటె
ప్రతినచెల్లింపనేరక సంగరమున శిష్యునకు లొగిన భృగుజుండుదీటె
యదలించి దాయపై నడవ వెన్కకొకింత జరిగినజానకీ జానిదీటె
మించెనాయపకీర్తి యంచు దామాలువేషమున బోరిన మహేశ్వరుండుదీటె
శాత్రవుడు పోర గదసినసాధిసాధ
నముల మఱచెడు భానునందనుడుదీటె
మొక్కపోవని యుక్కుపెంపెక్కు రాజు
రాజహంవీరుడగు కృష్ణరాజునకును. ౮౧

సీ. స్వాకృత దానార్జిత స్వానీపకాధ్వస్త దమ్ముతాంత్వో రాజరాజరాజు
స్వోపాత్త చాప విద్యాపాండితీ పూర్ణభటశిష్య ప్రఘ్నన భార్గవుండు
స్వప్రభావఖ్యాపక ప్రజాననిరీక్షణ వివర్ణిత రిపుస్త్రీభుజుండు
స్వయశోభిమర్శన స్వావదాతపాథోధి జననహేతు శ్వేతవనజవైరి
స్వాప్రతిమదోః ప్రతాపాళియాశచటుల
హేతివిద్యోతఖద్యోత దినుడు చామ
రాజతనయుండు శ్రీకృష్ణరాజమౌళి
ధర్మమును భూమి నాల్గు పాదములనిలిపె. ౮౨

సీ. ఆపద్గతవసుంధరా పాలురే తెంచ గూరిమిడదనయంత వారిజేయు
సామాన్యయాచక జనసమూహమునకు లక్షలొసంగియు లజ్జజెందు
నపరాధమొనరించినట్టి వారైనరా నేరంబులెన్నక గారవించు

శారయ మంగమూర్ధవమయూరె శిరీషసుమంబటంచు న
న్మారుఁడు మెచ్చుకోఁదగిన మంజులమూర్తులు వేశ్యలప్పు డిం
పారఁగఁగేళివలన్నడిచి రన్నరనాథవరేణ్యు మోసలన్. ౧౦౨

సీ. ననుఁగడగంట్లఁ గన్గొనె నేని నవనిధులిత్తునంచు గుబేరుఁ డెదురుచూడ
ముచ్చటించినఁజాలు ముల్లోకములయేలుబడియిత్తునని శచీపతి మెలంగ
నాటపాటల పరీక్షార్థంబు బిలుతురోయనుచు రంభాదులంతంతనిగ
తుంబురునారదాదులు విపంచ్యాది వాద్యములూనియుచు వెంటనంటినడువ
సొలపు సోయలు విలాసంబు సోయగంబు
సుగుణ తళుకును జగ్గు నిగ్గు గరువంబు
ఘూపులనయుక్తిసడ మహీశూరపురికి
నడిచె వేశ్యాజనంబు కృష్ణనృపు మ్రోల. ౧౦౩

వ. ఇట్లురుహావైభవంబునం బురంబు జేరి సుఖంబుండె ననిపలికి మహేశ్వరుండు జా
యం గాంచియో ముద్దుగుమ్మ, యిదికీర్తి కాంతా స్వయంవరోదంతంబు తెలుంగునీక్ష
ణింగించితినని మిన్నకున్న మిన్నేటిజడదాల్పుమున్నీనింజూచి సర్వమంగళ యిట్ల
నియె. ౧౦౪

క. నాదరము చేజనించిన, పావనకన్యకల కేలువట్టినయాభూ
మీశ్వరుని యింటనిలువం, గానలెమనకనుచు శైలకన్యకపలికెన్. ౧౦౫

ఆ. ఆవిధమున గౌరి యభవునొడంబడ
నాడి భర్తఁగూడి హర్షమునను
భవ్యమైన కృష్ణపార్థివేంద్రునివీట
నధివసించి పూజలందుచుండె. ౧౦౬

క. పరమేశ్వరుండు గౌరియుఁ
బరగెంచిన పొంకైసిరియుఁ బద్మాక్షుండా
ధరణీధవుపీట వసించిరి,
పరమానందప్రపూర్ణచేతను లగుచున్. ౧౦౭

సీ. అరగరాజకన్యక యొక్క నాఁటి వేకువవేళ నల్లనిత్రోనయుశంఖ
చక్రాంకుశములు పాశముతర్జనము ఖడియంబు శూలంబు కరాబ్జకమున
నలరారఁగోటిమార్తాండతేజంబుచే దిశలు వెలుంగఁగ దివ్యభూష
ణములు దాలిచి మోముననంబిరునవ్వు వెన్నెలగాయఁ గన్నుల నెనరువాలుక
నమర కామినుల్లుఢీగళ్ళబుల చరింప

మూర్తిమంతంబులై వేదములు నుతింప
సింహవాహన మెక్కి విచ్చేసినాదు
స్వప్నమునందోచె బుణ్యావశంబువలన. ౧౦౮

ఉ. ఏనుబిరానలేచి జగదీశ్వరికిం బ్రణమిల్లిభక్తిచే
నానతమూర్తినై భయముహర్షము నచ్చెరుపాటు వేడ్కయుక్
మానసమందుదట్టి కొంకమాటయు బల్కగ వేగమూఁగచం
నానసుదక్షత నూభవగాంచి యిట్లనెన్, ౧౦౯

తే. వత్స, నీపూర్వపుణ్యంబు వలననీకు
దర్శనంబిచ్చితిని నిన్ను ధన్యుఁజేయ
నేనుజగదీశ్వరిని మదభీష్టమొకఁడు
దెలిపెదను నీకు నీవదిదీర్పవలయు. ౧౧౦

క. కలఁడు మహీశూరపురిన్
జ్వాలరాజ్యరమావిభుండు చామమహీభృ
త్తిలకుని పుత్త్రుఁడు మద్వర
ఫలమలఘుయశుండు కృష్ణపార్థివుఁడనఘా. ౧౧౧

గీ. అతనికిని గీర్తికాంతకు నైనపెండ్లి
తెలుఁగుగావ్యంబొనర్పుము తెలుఁగుభాష
ననుచు నిక్కథ తెలుగెల్ల నాజ్ఞయొసఁగి
దేవిలోకైకమాత యదృశ్యయయ్యె. ౧౧౨

తే. అంతమేలుగాంచి యక్కలయార్యుల
కెఱుకపఱుప వారలిదిశుభంబు
గౌరిలోకమాఁత కరుణించెనీయెడ
దడయకామె యాజ్ఞనడుపుమనిరి. ౧౧౩

క. ఆపరమేశ్వరి యానతి
నాపార్థివునకును గీర్తికగు పెండిలిచా
ప్పోపినయట్లు రచించితి
శ్రీపరమేశ్వరికిఁ బ్రీతిఁ జేసెదుగోర్కెన్. ౧౧౪

తే. కీర్తికన్యాస్వయంవర కీర్తనంబు, వినినఁ జదివిన వ్రాసిన మనుజులకును
ఆపదవాలంగ సకలసౌఖ్యంబులమరు, సంపదలుగల్గు వంశంబుసాఁగుచుండు. ౧౧౫

చ. యదుకులసార్వభౌమ, వదనాపహతద్యుతిసోమ, పల్లవ
ప్రదరశతాభిరామ, జనరక్షణరామ, గుణాబ్ధిసీమ, దు
ర్మదరిపుభీమ, సర్వజనరంజననామ, ఖరాంశుధామ, యు
భ్యుదయపరంపరల్ గలుగుచుండుత మీకునుగృష్ణభూవరా. ౧౧౭

శా. సామంతక్షితిపాల సేవితపదాబ్జాతా, మహీశూరపూ
ర్ధామా, శ్రీవిజితేంద్రవైభవ భుజాదండోద్ధృతక్ష్మాతలా
చాముండాకరుణాఫలాయిత యదుక్ష్మాభృత్కులోత్తంస, ని
ష్సీమప్రాభవ, చామదాజతనయా, శ్రీకృష్ణరాజాగ్రణీ. ౧౧౮

స్రగ్విణి. సర్వసర్వంసహా చక్రసంరక్షణా
ఖర్వభారోద్వహా కామినీకీరగం
ధర్వవీణాకళా నారదా సాహితీ
గీర్వధూటీవరా కృష్ణరాజాగ్రణీ. ౧౧౯

గద్యము ... ... ... ... ... ...

సమాప్తము

రాజమహేంద్రవరము — కళావతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

